

# శ్రీ ఆత్మారామ తత్త్వామృతము.



తృతీయ ముద్రణము 2000 ప్రతులు.



గ్రంథకర్త:

## సాయం వరదదాసు

కావలయువారు యీ క్రింది విలాసమునకు వ్రాసిన బడయగలరు.

శ్రీ వ్యాసాశ్రమం, ఏర్పేడు పోస్టు, చిత్తూరు జిల్లా.



1944.

శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు.

ఓమ్ తత్ సత్.

శ్రీసద్గురు పరబ్రహ్మణేనమః.

# శ్రీ ఆత్మారామ తత్త్వామృతము.

—:0:—

ఓమ్ బ్రహ్మానందం, పరమసుఖదం, కేవలం, జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం, గగనసదృశం, తత్త్వమస్యాదిలక్ష్యం
ఏకం, నిత్యం, విమలమచలం, సర్వధీసాక్షిభూతం
భావాతీతం, త్రిగుణరహితం, సద్గురుం, తం నమామి॥

---

గీ॥ సచ్చిదానంద మయునకు ♦ శాశ్వతునకు
ఆదిమధ్యాంతరహితున ♦ కవ్యయునకు
పంచకోశవిలక్షణ ♦ భాసితునకు
వందనంబు సద్గురునకు ♦ వందనంబు॥

విఘ్నేశ్వర ప్రార్థన.

శ్లో॥ ఓమ్ లంబోదరం పరమసుందర మేకదంతం
రక్తాంత దీర్ఘనయనం పరమంపవిత్రం
ఉద్యద్దివాకరకరోజ్జ్వలకాంతికాంతం
విఘ్నేశ్వరం సకలవిఘ్నహరం నమామి॥

హిం - ఆది.

శ్రీవరారావేగ, గణనాథమమ్మెక ॥శ్రీ॥

(1) భావమునమనీ - పాదములేనమ్మి
వేమరు వేడద - విఘ్నవినాశన ॥ట్రో॥
(2) పార్వతి సుతుడవు - భవభయహారుడవు
పాలనసేయగ - జాలమికేలర ॥ట్రో॥
(3) సృష్టిస్థితిలయ - కార్యములకుముందు
ఇష్టముతో భక్తు - లెల్లగొల్తురునిన్ను ॥ట్రో॥
(4) కుడుములుండ్రాళ్లును - కడువడిగానిడి
తడయక నీదయ - బడయగవలెనయ్య ॥ట్రో॥
(5) ధరవ్యాసాశ్రమ - గురుకార్యంబుల
మరిమరి దీక్ష్ణచు - వరదాదాసుని నేడు ॥ట్రో॥

సరస్వతి ప్రార్థన.

శ్లో॥ యా కుందేందుతుషారహారధవళా
యాశుభ్రవస్త్రావృతా ।
యా వీణావరదండమండితకరా
యా శ్వేతపద్మాసనా ।
యా బ్రహ్మాచ్యుత శంకరప్రభృతిభి
ర్దేవైస్సదాపూజితా ।
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా ॥

(అమ్మానామనవిని) శ్రీరాగము - ఆది.

వాణీ ఘననీలవర్ణవేణీ - నవనీరజాతపాణి - ననుబ్రోవు
బ్రహ్మారాణీ ॥ హేవాణీ ॥

(1) నామదిలో నిన్నువినా - అన్యమెరుగ లేనమ్మా
వేమరు నీ పాదంబుల - వినుతిజేతు మాయమ్మా
కామితార్థములనొసంగి - కాపాడగ వలెనమ్మా
రాదా దయలేదా ఇది-వాదా? తరుణముగాదా॥వా॥

(2) పరమశివీశ్వరుడు మున్ను - బమ్మెరపోతన నీదగు
చరణసేవజేసి మోక్ష - సామ్రాజ్యము నొందెనమ్మా
వరదా దానునిపల్కుల - మరిమరి వినవలెనమ్మా
రమ్మా! వరమిమ్మా! నుతిగొమ్మా! ఇదిసమయమమ్మా
॥వా॥

## శ్రీరామ ప్రార్థన.

సీ॥ పేరుతో నమ్మని - పోరుతో జగముల
మోహింప జేయుచు - మురియువాని
గుణముతో పరివార - గణముతో సర్వేశు
మరపింపజేసెడు - తెరగువాని
ప్రేమతో నెనలేని - గోముతో భక్తుల
విడువక వెన్నంటి - వెడలువాని
యుక్తితో ఘనదివ్య - శక్తితో నమ్మిన
దీనుల వెతలెల్ల దీర్చువాని

గీ॥ నిర్వికారు నిరామయు - నిష్కళంకు
నిత్యపరిపూర్ణు నిఖిలేశు - నిరయరహితు
వమలు వచలు మహాదేవు - నద్వితీయు
నభవు శ్రీరాము గుణధాము - నభినుతింతు.

శ్రీరాగము—ఆట (నిన్ను నామది)

(1) ఎంత కరుణాశాలివో రామా
నా స్వల్పబుద్ధికి యెంత నినువర్ణింతు శ్రీరామా
అంతుదెలియని ఘోరకర్మము లెంతయో మును
జేసి చేసీ। చింతచేత జివికి చివికి చెడిన యీ
దీనుని భరించితి ॥వెంత॥

(2) భావమున గురు కార్యమెంచితి నీ
కడుసాహసమున, యభావ వైరాగ్యంబు జూనితినీ,
దేవుడే యున్నాడటంచును, దీనుడౌ యగ్రజుని
మేలును భావమందు దలంచిమూర్ఖపు-పట్టుబట్టిన,
నన్నుసైచితి ॥వెం॥

(3) దిక్కులేని పక్షినై తినిగా, ఒక దీనురాలు
ఒక్కబాలుడు వెంటనుండెనుగా,
దిక్కులన్నియు నిండి వెలిగె, ఒక్కజ్యోతే దిక్క
టంచును దిక్కుదెలియని దేశములలో, తిరుగు
చుండిన విడువకుంటివి ॥ఎం॥
చెడితినంచు భయంబు జెందిననూ

(4) నను నమ్మువారలు, చెడరుగాయని మూరు
బల్కుచునూ, ఇడుము లెన్నో సంఘటిల్లిన వడిగ
వాని నడంచివైచుచు, కుడినియెడమల దిరుగు
చుంటివి బుడుతనంటిన తండ్రిపోల్కిని ॥ఎంత॥

(5) శ్యామసుందర రూపుజూపితివి,
కల్యాణ గుణముల ప్రేమతో స్మరియింపజేసితివి,
రాముడనగను నేను ఆత్మారాముడను యోగీంద్ర
హృదయా రామకల్పకలాపననినీ రామతత్వము
నిపుడు దెల్పితి ॥ఎంత॥

(6) పతితపావన బిరుదునీదేరా, మరియొకడు దానిని
సతతమును భరింపజాలదురా, అతులితంబుగ శబరి
యుదుత యహల్యాలాదిగ నన్ను బోలిన మతివిహీనుని
వరకు నెందరు-గతులుగాంచిరో నీదుదయచే ॥ఎంత॥

(7) పతనమిక లేకుండ జేయుమురా, మది నన్నటికినీ
పతితపావన బిరుదు మరువనురా సతతమును మల
యాళసద్గురు-చరణకంజము లాత్మనిల్పిన సుతుని
వరదాదాసునతి సమ్మతి భరించిన-పతితపావన ॥ఎంత॥

---

గీ॥ సగుణమరయని మనుజుండు ♦ శాశ్వతముగ
వెలుగు నిర్గుణబ్రహ్మంబు ♦ తెలియలేదు
నందినే గాంచనేరని ♦ నరుడులోని
శివుని దర్శింపగలడె, యోచింపు మనస॥

నాదనామక్రియ—ఆది.

(1) రామతారకము దొరికెగదా నా
రామునగుణముల నరికెగదా

కామక్రోధ లోభమోహముల కాల్చి కాల్చి
మసి జేసెగదా ॥ శ్రీరామ ॥

(2) పుట్టుట గిట్టుట పోయెగదా యీ
గుట్టు గట్టిగా దెలిసెకదా
దట్టమైన గాఢాంధకారమున
పట్టపగటి భానుడు వెల్గెగదా ॥ రామ ॥

(3) పండినపండే చిక్కెగదా
ఆపండుమధురమే దక్కెగదా
అండపిండ బ్రహ్మాండ భాండముల
నిండినజ్యోతై పండువెన్నెలై ॥ రామ ॥

(4) అయిదు భూతముల గ్రమింగెగదా
పరమానందంబున పొంగెగదా
అయిదై దిరువదియైదులకవ్వల
నాదియు మధ్యయు నంతముగానిది ॥ రామ ॥

(5) వ్యాసాశ్రమమున నిలిచెగదా
గురుదాసుల మదిలో గొలిచెగదా
వాసిగవరదా దాసుని నేలిన
భాసురమలయాళ దేశికుదయచే ॥ రామ ॥

---

సీ॥ తీపులోని తీపు ♦ తెలియనేర్చినవాడు
పండ్ల తీపుపైని ♦ భ్రాంతినిడడు

అన్నితీపులకును ♦ ఆవలి తీపైన
పండులేని తీపు ♦ బడయుజీవ!

నాదనామక్రియ — ఆట.

(1) పండులేని తీపు దినరా మనకు
పండితే యీ పండు పక్వమాగనరా ॥ పండు ॥
(2) ఇంతని యీ తీపు, నేమనివివరింతు
అంతులేనితీపు, అదియేమో తీపు ॥ పండు ॥
(3) కొంటేను దొరకదు, తింటేను తరుగదు
అంటి అంటనిపండూ, అమృతమైయుండూ ॥పండు॥
(4) కదళిమామిడద్రాక్ష ఖర్జూరములుగావూ
తుదిమొదలు లేని యీ పదవిగన్గొనరా ॥ పండు ॥
(5) నడివీధిదారిలో గుడియుందు నాడుచు
పడతుకచేతిలో నిడుకొన్నపండూ ॥ పండు ॥
(6) వాసిగ మలయాళ దేశికు కరుణచే
భాసురముగ వరదా దాసుభాగ్యము పండు ॥పండు॥

---

గీ॥ అన్నియోగములకు నైక్యసూత్రంబయి
పరమమైన దేశభక్తికలిగి
సర్వమానవులకు సరళమార్గంబగు
పూర్ణయోగపథము బూనుజీవ!

(శ్రీ)రాగము - చాపుతాళము.

(1) ఇదియె బ్రహ్మానంద భోగముగనరా

ఇదియె స్వర్గానంద భోగమువినరా॥
అది యెక్కడోనున్న - దనుచు జూడకురా ॥ఇది॥
(2) సాంఖ్య సూత్రములకై - శ్రమము జెందకురా
సంఖ్యయొక్క టెచాలు - సాంఖ్యమదియేరా ॥ఇది॥
(3) నేతినేతివాక్యనియతి చాలదురా
ప్రాతవాసనలన్నీ = రోతజేయునురా ॥ ఇది ॥
(4) త్యాగంబుతోగాని - రోగమణగదురా
త్యాగంబువైరాగ్య - భాగమేవినరా ॥ ఇది ॥
(5) కరుణప్రేమలతోడ - కరగిపోవలెరా
కరగించి నీమది - గురుతుజూడుమురా ॥ ఇది ॥
(6) కరుణత్యాగంబులె - పరమసాధనరా
పరమసాధనజూని - బయలు దేరుమురా ॥ ఇది ॥
(7) అరసి పుణ్యపాప - మర్పణజేసి
పురుషోత్తమునిపైని - బుద్ధి నిల్పుమురా ॥ ఇది ॥
(8) బుద్ధినిల్పినవెనుక - పురుషోత్తముండూ
సిద్ధముగ నీలోనె - సిద్ధించియుండూ ॥ ఇది ॥
(9) పడియున్న యురగము - పైకిలేచునురా
నడిమింటి మార్గాన - నాట్యమాడునురా ॥ ఇది ॥
(10) పరిపూర్ణయోగము - తెరగుజూడుమురా
మురిపెముతో జీవన్ముక్తి - గాంచుమురా ॥ ఇది ॥
(11) ధరలోన మలయాళ - గురుకృప గనరా
వరదా దాసుండిది - మరగెను వినరా ॥ ఇది ॥

---

గీ॥ గజముమీఁదనున్న ♦ ఘనధీరవరుడగు
నరుడు శునకములకు ♦ వెరువనట్లు
రామసుధనుగన్న ♦ నీమది దురితాళి
కింక భయము జెంద ♦ నేల జీవ !

మోహన - ఆది.

(1) నిక్కముగా కరినెక్కితివేనియు - కుక్కలతో భయ
ముండదయా - చక్కనగా నడి — నాళములోఁబడి
సొక్కుచు సోలుచు నుండుమయా ॥నిక్క॥

(2) మొన్నోన్నిపాపము లున్నవినాశని విన్నదనము నీకేల
నయా -అన్నిటికొక లే రామబాణమది - కన్నాకై
నీకున్నదయా ॥నిక్క॥

(3) కోటిజన్మముల జేసిన పాపము కూలిపోయెనని యెంచు
మయా - నోటినిండ శ్రీరామ! రామ! యని ధాటి
మీఁరజపియింపుమయా ॥నిక్క॥

(4) జ్ఞానులలో రమియించెడు రాముని - జ్ఞానముతోడ న
గాంచుమయా - జ్ఞానాజ్ఞానములైన రెంటికిని —
సాక్షిగ నీమది నుంచుమయా ॥నిక్క॥

(5) వాసిగ శ్రీమలయాళ సద్గురుల - భాసురసేవల జేయు
మయా - దాసుడు వరదా దాసుడు నిరతము తరచి
యొరింగిన సారమయా ॥నిక్క॥

---

గీ॥ పాటబాడినంత ♦ భజన పూర్ణంబగు
నంచు మనసులోన ♦ నెంచవలదు
ఆత్మలోనిసమధి ♦ కానందయుతమగు
పందులేని భజన ♦ పొందుజీవ!

కేదార - ఆది. (కనుగొంటిని)

భజనసేయవే - జీవాత్మా రామ ॥భజన॥

(1) అజహారాదులెల్ల - ఆనందమందిన
విజనమైనస్థలము - విడువకుండ రామ ॥భజన॥

(2) వచ్చేపొయ్యేదారి - హెచ్చుగాదు గనవే
చొచ్చలేనిదారీజొచ్చి - అందుజేరి ॥భజన॥

(3) రాగతాళసహిత - రమ్యమైనచోటా
రాగద్వేష రహిత - భోగమైనపీటా ॥భజన॥

(4) దిక్కులజూడక - ప్రక్కదారిబకక
ఒక్కగురుతు విడక - సాక్షిసోలిరామ ॥భజన॥

(5) శ్రుతికివేరుగాక - గతినిబూరిపోక
మతినిజెదరనీక - పతతమునురామ ॥భజన॥

(6) వాసిగమలయూళ - దేశికులకృపచే
దాసుడైనవరదా - దాసుజేయురామ ॥భజన॥

---

సోదరీమణులకు సామాన్యమాత్ర ప్రబోధము.

గీ॥ ఎందుపతులకు గౌరవం ♦ బెసగుచుండు
నందుదేవతల్ సంతస ♦ మందుచుండు

కరుణలేని శాసనముల ♦ సరకుగొనక
జ్ఞానపూర్ణత సాధింప • బూనరమ్మ॥

సావేరి—ఆట.

(1) చెలులార యిటురారే - శ్రీ ఆత్మారాముని పలుమారు
పూజింతమూ! ॥చెలు॥
పుట్టుకలోని కొరత దీర్చుకొందుమా, గురుకరుణచే
పరమ సద్గతి గాంతమా; పావనులారా! ఇలలోన
మనదొక హీనజన్మంబాచు కలలోననైననుగలపోయ
వలదమ్మా, మెలగి పంచభూతములచే - మిళితమైన
తనువులెల్లా దలపనొకటేగానిభేదంబులకు స్థానము
లేదుసుమ్మా ॥చెలు॥
(2) ఘనయోగులకు గురుని, జనకరాజేంద్రుని
పెనుతర్కములనుంచి నా - సులభాదేవి
వనితారత్నంబెకాదా?
మైత్రేయికాం- డిలిని మగువలుకారా?
సీతాదేవి మనలో జన్మింపలేదా
యమునితో బోరి - తినప్రాణేశుని బ్రతికించిన సావిత్రి
దేవి మనలోని ముగుదయే మాన్యచరితలారా?
ఘనసరోజనిదేవి భక్తియు గనుడి యానిబెసెంటు
జ్ఞానము వినుడియందరో ముక్తికాంతలు
వెలసిరిప్పుడుకూడ ధరలో ॥చెలులార॥

(3) పరమేశ్వరుడె యిట్లు తరుణియై పురుషుడై ధర
క్రీడింపుచు నుండెగా - నిజముగజూడ తరుణి జన్మమె
ఘనముగా - గర్భధారణను భరింపగవలెనుగా
నవమాసంబులును మోసికనిపెంచి ఘన
బుద్ధులను నేర్పి
తనయుని యొసగెడు తల్లి తక్కువయౌనే?
కనుకనే తలిదండ్రు లంచును వెనుకనుంచిరి
తండ్రిపేరును-కనుడి యీ విధముగను
అన్నిటికిని తరుణి నామంబు ముందే ॥చెలు॥
(4) ఋణముతీరినయంత చనిపోవు మగనికై పెనుదుఃఖ
మందుటయూ-వేరొకపురుషు పెండ్లి కాగోరుటయూ,
సంసారాట విని క్రుగ్గి కూలుటయూ-ఇవన్నియు,
ఘననీచకార్యముల్ వినుడి కామినులారా!
మననాధుడే సర్వంబునకు నాధుడునుమ్మా
నిత్యుడగు ప్రాణేశుడుండ, యసత్య విధవా నామ
మేటికి సత్యమెరిగిన తరుణులందరు, నిత్యముత్తైదువలు
నుమ్మా ॥చెలు॥
(5) కరుణించిదేవుడే తరుణులకు సన్న్యాసాశ్రమమునొసంగ
నుగా ఇంకేటికి దురితకర్మల జేయగా
నీచభోగ ములగోరి నశియింపగా
అపకీర్తిసా గరమునబడి మున్గగా
అస్థిరమైన దీక్షతో పరమాత్ము మదినిల్పి

మరిక దేహముపైని మరిపము విడనాడి స్థిరమైన
గురునిసత్కృపచేత నిరతము నెరుక మరుపులులేక
తరుగని పరమపద సామ్రాజ్య వైభవ
పట్టభద్రులుగారె కొమ్మా ॥చెలు॥

(6) భయమను దయ్యమును పారద్రోలి ని
ర్భయముగ నుండరమ్మా, పాపంబనిన
భయ ముండవలెనుసుమ్మా-లోకముతోడి
భయము మనకేలనమ్మా
అందరికిని భయపడి దేవుని భజనసేయగలేక
భ్రమజెంది మరణించు సమయమునందున
రయము మీరగ యముడు రమ్మికరమ్మనుచు లాగంగ
నప్పుడు అయ్యొయోయంచును యేడ్వ నెవరు అడ్డగింపగ
వత్తురమ్మా॥ ॥చెలులా॥

(7) ధరను శ్రీమలయాళ గురువర్యులను మదిని
మరువక నుతియింతమూ, ఆ మహనీయు
కరుణాగుణము నెంతిమూ,
సద్గురుస్వామి చరణముల్ సేవింతమూ,
వ్యాసాశ్రమ వరపుణ్యస్థానము వరుసదర్శింతము,
వరదా దాసులపల్కు మరిమరి విందము,
వరగనీధర బుద్ధదేవుని పరమపద సామ్రాజ్యభాగము
తరుణులంతరి కబ్బురీతిని
నిరతమునుసాధనము జేతము ॥చెలులార॥

గీ॥ హృదయపుండరీకంబున ♦ విదితమైన
పరమసుందరాత్మారాము ♦ పటమునిల్పి
ఘనయనాహత సంగీత ♦ గానమిళిత
భజనతోడి ప్రసాదంబు ♦ బడయరమ్మ!

శహాన—ఆది.

(1) పడతులారా ఆత్మారాము - భజనమూను సేయారే
మనరాముని హృదయపద్మ - మందిరమున నిలుపారే
॥పడ॥

(2) సొగసుమీరా ప్రణవనాదా శ్రుతినిబాగా వేయారే
తగుమృదంగా శబ్దమదిగో తాళరవమాలించరే ॥ప॥

(3) శ్రుతినిగూర్చి వేణునాద మతివలందరు యూదరే
అతికోలాహలంబులోన అబ్ధిరవమూ జూడరే ॥ప॥

(4) ఠేరిఘంటా నాదములతో భూరిహారతి బూనరే
గారవమున కళలతోడి కర్పూరజ్యోతివ్వారే ॥ప॥

(5) ఆదరముగబిందువనెడు ప్రసాదమనుభవించరే
వాదమేల యింతమధురం బేదిలేదని యెంచరే ॥ప॥

(6) అందముగ నన్ని రాము నంచెలీనం బాయెనే
మందగమనలార! బ్రహ్మానందమయమైపోయెనే ॥ప॥

(7) వాసిగ మలయాళసద్గురు స్వాములదయ గాంచరే
భాసురంబుగను వరదా దాసుపలుకాలించరే ॥ప॥

---

గీ॥ ప్రకృతి పుష్పములను - పలుమారుపూజించి

వెతలబడగనేల - వెఱ్ఱులగుచు
సుగుణ సూనములను - భగవంతునర్చించి
ఫలమునొందరయ్యా - ప్రాజ్ఞులార.

శ్లో॥ అహింసాప్రథమం పుష్పం పుష్ప మింద్రియనిగ్రహః
సర్వభూతదయా పుష్పం క్షమా పుష్పం విశేషతః
శాంతి పుష్పం తపః పుష్పం ధ్యానపుష్పం తథైవచ
సత్య మష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్ ॥

శ్రీరాగం - ఆది.

(1) అందమైన పువ్వులగోయండీ - ఓభక్తులారా!
ఆత్మారాముని పూజసేయండీ
అందమైన పువ్వులగోసీ - ఆత్మారాముని పూజజేసీ
అందముమీరంగ బ్రహ్మా-నందపదవి నందరండీ ॥అం॥

(2) చెట్టు లేని పువ్వులచూడండీ - అవి చేతులతో
ముట్టిదునుమ కుండగోయండీ
గట్టిపూర్వసుకృతమనే - చెట్టుమీలోగలిగియుంటే
పట్టుబట్టి మనసుతోనే-ముట్టిపువ్వులగోయరండీ ॥అం॥

(3) మొదటిదే యహింసాపుష్పమూ- ఇది ఆత్మారాము
మూలాధారమున నుంతమూ
ఇది మొదలు పరులకెపుడు - హింసచేయవలదుసుండీ
మదిని యిదీ మరచితేనూ-మనపూజలు విఫలమండీ ॥అ॥

(4) ఇంద్రియనిగ్రహాము రెండవదీ
ఇది ఆత్మారాము - నందుస్వాధిష్ఠానముంచేదీ

ఇంద్రియాదివిషయసుఖము - లెల్ల తుచ్ఛమంచుకోనీ
ఇంద్రియాతీతూనియందూ-డెందముపొంది[illegible]రండీ॥అం॥
(5) సర్వభూతదయయు మూడవదీ
ఇది ఆత్మారాము - పరిమణీపూరముననుంచేదీ
సర్వజీవకరుణతోడ సాత్వికాహారంబుతోడ
సర్వేశుని కృపనుబొందీ సకలసౌఖ్యములందరండీ॥అం॥
(6) నాల్గవదిక్షమాపుష్పమూ ఇది ఆత్మారామునకు
యనాహతమున నుంతమూ
అల్గిమనల నెవ్వరైనా అనగ రానిమాటలనిన
అంటుకొననిమదిని భూమివంటి యోర్పు బూనరండీ॥అం॥
(7) ఐదవది శాంతిపుష్పమూ - ఇది ఆత్మారామునకు
విశుద్ధ మూననుంతమూ
వాదముల భేదముల క్రోధమును బెరుగనీక
పాదుకొని పరమశాంతి బడసిసుఖము నందరండీ ।అం।
(8) ఆరవది తపోపుష్పమూ — ఇది ఆత్మారామునకును
ఆజ్ఞేయముననుంతమూ
కోరి తగినస్థలమునందూ జేరిగురుని గురుతునందె
ధారణగా మనసునిల్పి తపముసేయువలెనుసుండీ॥అం॥
(9) ఏడవది ధ్యానపుష్పమూ - ఇది ఆత్మారాము
సెనసహస్రారమున నుంతమూ
వేడుకతో జగతి నాటలాడు మీరు మిమ్మెరింగి
పీడరాని ధ్యానమున కూడుకొనియుండరండీ ॥అం॥

(10) సత్యమెనిమిదవపుష్పమూ - ఇది ఆత్మారాము
నిత్యనిర్గుణముననుంతమూ
సత్యమార్గమనుసరించీ సత్యరూపు నాశ్రయించీ
నిత్యసమాధిని మునింగీ నిర్వికల్ప మందరండీ ॥అం॥
(11) నిరతమిది మరువకుండండీ సద్గురునిబోధ మురియు
చును నాలకించండీ
ధరణి శ్రీమలయాళసద్గురు కరుణ మీరు పొందరండీ
వరదదాసు మనవి వినీ పరమపదవి నందరండీ ॥అం॥
గీ॥ శివుడె జీవుడై యన్నిట ♦ వెలగుచుండ
శివుడు జీవుడు వేరని ♦ జెప్పనేల?
బింబమునకును తత్ప్రతి ♦ బింబమునకు
గలదె? భేదమించుకయు లో ♦ కమున మనస!

కీరవాణి - ఆది.

(1) శివుడూజీవుడు - వేరుగలేరని
చిత్తములో నెర - నమ్మరయా
శివుడేదేవుడు -జీవుడేశివుడూ
శివజీవైక్యము - గనరయ్యా ॥శివు॥
(2) నాట్యముకొరకై వేషమువేసుక - నటనమొనర్చుచు
నుండెనయా। నాట్యావసరము తీరినవెంటనె - నఖిల
ముతానై వెల్గునయా ॥శివు॥
(3) జీవగుణంబులు-సమయుచునుండిన - దేవగుణంబులు

వెల్గునయా । దేవగుణంబులు నణగినిర్గుణా - భావ
బ్రహ్మంబగునయ్యా ॥శివు॥

(4) తరుణీవేషము దాల్చినపురుషుని-తరుణియంచు భ్రమ
నెంతురయా । తరుణీవేషము దొలగినపిమ్మట-పురుషు
డనక యేమందురయా ॥శివు॥

(5) ఘటములోన బింబించినసూర్యుడు - ఘటముపోవ
మెందేగెనయా । ఘటములోనిదే మాయాజీవుడు –
కనుగొన శివుడే సూర్యుడయా ॥శివు॥

(6) అన్నిటినీ తగిలించుకొనుచుయా - పన్నతజెందిన జీవు
డయా । అన్నిటి నీకడ ద్రోసివైచితా - నంతట వెల్గిన
శివుడయ్యా ॥శివు॥

(7) వాసిగ శ్రీమలయాళ సద్గురుని వరకారుణ్యము గన
రయ్యా దాసుడువరదా దాసుడు నిరతము తరచి
యెరింగిన తత్త్వమయా ॥శివు॥

గీ॥ జన్మఫలకారణంబుగా ♦ జనుల కిలను
వేరు వేరిష్టదైవముల్ ♦ వెలయుచుందు
రదియెరింగి బోధనసేయు ♦ నామహాను
భావుడే సద్గురుండన ♦ బరగు జీవ!

నాదనామక్రియ - ఆది.

(1) ధీరుడవై యిక నిల్వుముర, భీరుత్వము నీకెందుకురా
ఘోరమైన సంసారాటవికిని-కుఠారమిదిగో దొరికెను
గనరా ॥ధీ॥

(2) గొడ్డలికర్రే త్యాగమురా - యిక దొడ్డభక్తియే గొడ్డలిరా। అడ్డమైన సంకల్పము నరుకగ - అతిపదునైనది రామమంత్రమురా ॥ధీరు॥

(3) కృష్ణమంత్రమే మూలికరా - శ్రీకృష్ణప్రేమయె రసమగురా। దుష్టవిషయ ఘనసర్పవిషంబును - నష్టముచేయు సదృష్టము కండెర ॥ధీరు॥

(4) పంచాక్షరియే ప్రమిదగురా-శివభక్తియె చమురై వెలసెనురా। అంచితజ్ఞానమే జ్యోతిమండెర - అజ్ఞానాంధము హతమైపోయెర ॥ధీరు॥

(5) మహావాక్యములె విల్లగురా- అనుభవానుభవమే బాణమురా - అహంబ్రహ్మమే తల్లక్ష్యమురా। అహము సోహమున ఐక్యంబాయెర ॥ధీరు॥

(6) అన్నిటినొసగే కల్పమురా-గురులామలయాళస్వాములురా। తిన్నగవరదా దాసుని నేలిన - కన్నతండ్రి నా ఘనుని భజింపర ॥ధీరు॥

---

గీ॥ బాహ్యచిహ్నములను ♦ పలుమారు ధరియించి
ఆత్మనెరుగు చిహ్న ♦ మరయకున్న
ప్రాణిలేని శవము ♦ భంగి నిరర్థకం
బగును బ్రతుకటంచు ♦ నరయుజీవ!

సావేరి - ఆది.

(1) నామం బెట్టుమురా - జీవా - నీమంబట్టుమురా

నామము నందలి నడిమార్గంబున నక్కనితరమును
సొక్కుచునుంటే ||నామం||

(2) విభూతిబూయుమురా - జీవా విభవంబెరుగుమురా
విభూతికాబడు దేహమునందలి యభావభావ స్వభావ
మెరిగితె ||విభూతి||

(3) లింగంగట్టుమురా జీవా - సంగతెరుంగుమురా । లింగ
దేహమును భంగముజేసి-లింగాంగంబుల సంగంబెరి
గితె ||లింగ||

(4) తులసిని దాల్చుమురా-రుద్రాక్షలను ధరించుమురా
తులసీరుద్రాక్ష ప్రియశంకర - జలజలోచనుల కల
యికగంటే ||తుల||

(5) తెలిసిచేయవలెరా అందున - ఫలముగాంచవలెరా।
తెలిసి తెలియక డాంబికమునకై - మెలగిన దేవుడు
మెచ్చడురా నిను ||నామం||

(6) వ్యాసాశ్రమమునరా - గురుదాసుల జూడుమురా
వాసిగ వరదా - దాసుని నేలిన । భాసురమలయాళ
దేశికు గొల్వర ||నామం||

---

గీ|| వేమనాది గొప్ప ♦ విబుధవర్యులచేత
నింపుగా బహిష్క ♦ రింపబడిన
కంపుభంగి దాగి ♦ కళవళ పడనేల
దీనితోడి పొందు ♦ మానరయ్య !

వేమనపద్యం:—గీ॥ వింగినేగువాడు - నీలోకమున లేడు
భంగిత్రాగువాడు - ప్రబలబోడు
కొంగరోగమునకు-కోర్కెలుదీరునా
విశ్వదాభిరామ వినురవేమ.

వీరబ్రహ్మంగారి వాక్యము:—"కల్లు భంగి సారాయిలు త్రావి ఒళ్ళుమరువ మనకేలనయా"

మనము వీరికంటె గొప్పవారమా?

శ్రీరాగము - ఆట.

(1) భంగిత్రాగుట మానివేయండీ-సుజ్ఞానమునకిది భంగ కారియటంచు నమ్మండి। సంగతెరిగిన జాలునిక యీ_ భంగిద్రావిన ఫలము శూన్యము। భంగపడి పోట్లాల కొఱకై - తొంగితొంగి చూడ నేటికి ॥భంగి॥

(2) ఆదిశంకరు లేమి-త్రాగిరయా
మన వీరబ్రహ్మం- కాదుమనకిది యంచు బల్కెనయా
పెద్దలందరు త్రాగినారని - పెద్దయార్భాటంబు జేయక
ముద్దుగా వేమన్న బల్కిన-సుద్దులన్నీ చదివిచూడుకీ
॥భంగి॥

(3) కల్లుసారాయ్ వంటకైపేగా - ఇదివానికన్నను వళ్ళు గుల్లగజేసి వైచునుగా। గళ్లలుమియుచు దగ్గుదగ్గుచు-కంటనిద్దురలేక నిరతము। పిల్లకూతల రోగమునబడి తల్లడిల్లి పోవనేటికి ॥భంగి॥

(4) జ్ఞానపత్రికయటంచు బల్కేయా - పొగత్రాగినంతనె జ్ఞానమబ్బునటంచు నమ్మేయా! జ్ఞానపత్రే చాలు మీకిక - సద్గురుడు పనిలేదుకద యీ! కాని పోని మాటలాడుచు మానవుల చెరుపంగనేటికి॥భంగి॥

(5) ముందుయెవరో త్రాగిపారనుచూ-వారొందురామా నందమే మనకబ్బుననుకొనుచూ। పొందుగా పామరులు పొట్లాల్ - వందలాదిగ యిత్తురంచును। క్రిందు మీదై నంతనే ఆ- నందసాగర మెటులభించును ॥భంగి॥

(6) రెండుమూతుల చిల్మిబట్టండీ - సంకల్పపత్రీ - నిండి యుండే వేళ చూడండీ। దండిగా యోగాగ్ని వేసీ-ధగ్గు ధగ్గునమండజేసీ। పండువెన్నెల పొగను గుప్పున బట్టి మ్రింగిపైకి విడువుడి ॥భంగి॥

(7) వుండిపొయ్యే కైపదేలండీ - మనజన్మమంతానిండి యుండే కైపుబట్టండీ। ఉండిపొయ్యే జగమువద్దని - నిందులేని కైపుజేసిన। పుండుమానుప బూని వేరొక- పుండుజేసిన యట్టులౌనిక ॥భంగి॥

(8) నిక్కముగ నామాటజూడండీ - నడినాళమందున సొక్కుచుండే కీలుదెలియండీ - టక్కరీగంజాయి త్రావి దారి నెరిగితిమంచు నమ్మిన - కుక్కతోకను బట్టి మనుజుడు గోదవరిలో యీదినట్లగు ॥భంగి॥

(9) పెద్దలని తమవద్దజేరేయా - జనులెల్ల యిదియేపెద్దరిక

మని త్రాగిచెడిపోయేరూ। బుద్ధిలేనీ మానవులకూ-బుద్ధి జెప్పే వారె పెద్దలు । బుద్ధిచెరిపేవారినెట్టుల పెద్దలని బిల్వంగ నగునిక ॥భంగి॥

(10) చెప్పినందుకు కోపపడకండి - మనలోనగల్గిన తప్పు లన్నీ పమయువలెనండీ। మెప్పుగామలయాళ సద్గురు - నెప్పుడూ హృదయమున నిల్పుచు॥ తప్పులెన్నక వరద దాసుని-తత్త్వమార్గము తరచిచూడుడి ॥భంగి॥

గీ॥ మూడుకాల్వల లంఘించి ♦ మూడునదుల
సంగమమునందు గ్రుంకిడి ♦ పరిత్రికూట
పర్వతముపైని మేడలో ♦ పడతిగూడి
భోగమందువాడే రాజ ♦ యోగి వరద!

---

బ్యాగ్-ఆట. "రామచంద్రా నీనామ"

(1) అద్వైతానందం అనుభవమే లేక-వ్యర్థులై కొందరు తిరిగేరయా । అద్వయబ్రహ్మం బంతటనుండగ- అది యెందో కలదని వెతకేరయా ॥అద్వై॥

(2) అచలులమంచును జిహ్వాచాపల్యాన। అన్నిజీవుల చంపి భ్రమింగేరయా-అచలులేమో చూతమని పరీ క్షించిన - సచలులై కడు కోపగించేరయా ॥అద్వై॥

(3) కల్లును, సారాయ్, గంజాయి త్రాగీ-అల్లరి కేకల వేసే రయా । కుల్లులేని మంచి మైకముగనలేక - కల్లుంగంజా యితో కుళ్లేరయా ॥అద్వై॥

(4) చిలుకపలుకుల సాంఖ్యముబలుకుచు - పలుమారు
తత్త్వాలు పాడేరయా-అలవికాని కామక్రోధద్వేషా
లతో-అందరి నెమ్మది చెరిచేరయా ॥అద్వై॥

(5) కాయదోషంబులు-మనకంటవంచు - నమాయకులను
మోసగించేరయా - కాయముపై చూతమని వాత
దీసిన- కంపించి విలవిలయేడ్చేరయా ॥అద్వై॥

(6) హ్రాంముహ్రీంమనుచు-గాంజాయిడమ్ముకు-పామరులను
యేడిపించేరయా - ప్రేమ కారుణ్యము, శాంతిలేక
ఆత్మా రామానందము నెట్లుగాంతురయా ॥అద్వై॥

(7) పండినపండ్లైతే భగవంతుని రీతిని - దండికారుణ్యాన
నుంచేరయా -మొండిదేహము నంటియుండిన యంతకు
నింముపమాధిలో పండేరయా ॥అద్వై॥

(8) ధరను శ్రీమలయాళ గురువర్యుబోధన - లరసి
సుజ్ఞానము నెరిగేరయా ॥ వరదా దాసునిపలుకు మరి
మరినాలించి-పరమత్యాగంబున బరగేరయా ॥అద్వై॥

గీ॥ సర్వశాస్త్రంబులను గల్గు ♦ సారమెల్ల
రెండుమాటలేగనుడి, ♦ యఖండకరుణ
పుణ్యమగు, జీవహింసయే ♦ భూరిపాప
మగును, మాంసభక్షణ ♦ మానుడయ్యలార॥

ఇందుకు వేమన సాక్ష్యము.

గీ॥ తనవలెనె నవియును ధర ♦ బుట్టినవి కావో
వరగ తమ్ముణ్ణవంటి ♦ బ్రతుకుగాదో

జ్ఞానివానిజంప ♦ కారణమేమిరా ?
విశ్వదాభిరామ ♦ వినురవేమ ॥

గీ॥ జీవి జీవిజంపి ♦ జీవికి వేయగా
జీవివలన నేమి ♦ జిక్కియుండు
జీవహింసకులకు ♦ జిక్కునా మోక్షంబు
విశ్వదాభిరామ ♦ వినురవేమ ॥

బ్యాగ్ - ఆది.

1. మాంసభక్షణము మానండీ పర-మాత్ముని మదిలో నమ్మండీ। హింసనెరింగిన అనుభవపరులై -హింసకు లోబడనేల వినండీ ॥మాంస॥
2. జీవుల మొర నాలించండీ అవి - దేవునిబిడ్డలె యను కొండి జీవులపై దయలేని కపటునికి - జీవబ్రహ్మై క్యము లేదండీ ॥మాంస॥
3. పెద్దలపనియిది గాదండీ మరి - పెద్దపులులపని యిది యండీ। పెద్దలపని యీ తెరగుననుంటే - బుద్ధిహీను లెటు బుద్ధులనేర్తురు? ॥మాంస॥
4. తనుకలాడంము చూడండీ మీ - కనులకుగనుపడ దే మండీ! వనవిపనవి బేబేయనియరువగ-పరపరకంఠము గోయుదురండీ ॥ మాంస॥
5. మీశరీరముల గోయండీ-లవలేశమైన సహించండీ మీశరీరమునకున్ను బాధలే- ఆశరీరికున్నవి యను కొండి ॥మాంస॥

6. కాని తింటూన్నామనకండీ—అవికోయుటకంటే నేనండీ తినువారలు లేకుంటే కోయరు—తిన, కన, కోసిన, అనుకొనదోసము ॥మాంస॥
7. కాయగూరలే చాలండీ - మన కాయము నిలుపుట కొరకండీ। కాయగూరలకు ఇంద్రియరహితము - కావున బాధలగన బోవండీ ॥మాంస॥
8. శుక్లశోణితమయమండీ-అదిచూడ నసహ్యంబగునండీ శుక్లశోణితము ముట్టరాదుగద - అక్కటనాలుకపై యెటులుంతురు ॥మాంస॥
9. కాటిలో వేసే శవమండీ-అది కడుపున వేయుగ నేలండీ? కాటికిబోవును పీనుగలందురు-కడుపుండగమరి కాడే లండీ ॥మాంస॥
10. జీవులమీావలె సాకండీ - ఆశీవసహాయము పొందండీ నివ్వలేచుటకు నీటిశుద్ధికిని-పాలుపెంట కంబళ్ల తృప్తి గని ॥మాంస॥
11. కరుణకు మిక్కిలి లేదండీ-యిదిపరమపదవికే బాటండీ కరుణలేని వేదాంతముసోటికి-బసువేదానితో ఫలమే మున్నది ? ॥మాంస॥
12. కరుణే దేవుని గుణమండీ - యీాకరుణను ముందుగ నేర్వండీ। ధరలో వేమన బుద్ధ మహాత్ములు-పరిపూర్ణం బగు పదవినిజెందిరి ॥మాంస॥
13. తర్కవాదములు మానండీ - యిదితర్కమునకు తరి

గాదండీ! అర్కుని తేజంబది గో వెలిగెను - అంధకార
మికహాతమైపోవును ॥మాంస॥

14. వ్యాసాశ్రమమున కేగండీ-గురుస్వాముల సత్కృప
జూడండీ! వాసిగవరదా దాసుని నేలిన-భాసురమల
యాళ దేశికుదయచే ॥మాం॥

---

గీ॥ కలియుగములోన ♦ కృతయుగ ఫలితమైన
సత్యప్రేమముల్ ♦ చెన్నారుజూడ గాంచి
తెలిసిమెలగిన వారికే ♦ గలదుముక్తి
వాదముల భేదముల ♦ నిక వదలరయ్య!

---

హిం — ఆది.

1. వాదముల పెంచకండీ-క్రోధముల బూనకండీ
రాదుయుపజయంబుమాకు — లేదు లేదు జయము
మీకు ॥వాదము॥

(2) అస్ఖలితబ్రహ్మచారి - ఆంజనేయు డదుగోనండీ
మాంసభక్షణ సురాపాన-మాయాజ్ఞానము మాడ్చ
నండీ ॥వాద॥

(3) త్రేతాయుగమునందువలె - యీతరిని జంపడండీ నీతి
దెల్పి మదినిగల - రోతహతము జేయునండీ ॥వా॥

(4) రామదూషణంబుజేసే - రాక్షసులపై పడండీ ప్రేమ
తోడవారిజేరి - ధూముధాము జేయునండీ ॥వాద॥

(5) రామరాజ్యమనెదు భరత - రాజ్యమిక సాగునండీ రామరాజ్యమనగ మన-ప్రేమరాజ్యమే సుమండీ॥వా॥

(6) సిద్ధముగ మరలనేడు-బుద్ధు లవతరించిరండీ రద్దులేని శ్రీయశోక - రాజ్యమిక జరుగునండీ ॥వాద॥

(7) హింస, వేశ్య, గంజాయాది - హీనాచారాల్ పోవునండీ హింసనాపే నిర్వాణము - అంతటను వెలయునండీ ॥వాద॥

(8) ధరను శ్రీపులయాళగురుల - కరుణమదిని జూనరండీ వరదదానుహితమువిని-పరమపదవి గాంచరండీ॥వా॥

---

గీ॥ అంగములకు నుత్త ♦ మాంగంబు లేకున్న
నన్ని వ్యర్థమైన ♦ యట్లుగాగ
మంత్రములకు ప్రణవ ♦ మాది లేకుండిన
నిష్ఫలంబటంచు ♦ నెరుగు జీవ!

——: o :——

బ్యాగ్ - ఆది.

(1) సారముగనరా - ఓంకారమువినరా। ధీరుడవై ప్రణవ నాదము - భోరుకొల్పరా ॥సా॥

(2) అనగరాదనీ-అదివినగరాదనీ। అనుచుమనల కొందరెంతో అడ్డగించిరిరా ॥సా॥

(3) మోసగించిరీ - మదిని ద్వేషముంచిరీ। పాశములగట్టియిటుల - పాడుజేసిరిరా ॥సా॥

(4) పంచభూతముల్-ఓం అటంచుప్రమోగగా। పంచ భూత
మిళితులకు - భావమెట్లగురా? ॥సా॥

(5) వాదమేటికిరా - లింగభేదమేటికిరా । సాధుసద్గుణంబు
లతో - బోధపడునురా ॥సా॥

(6) ఆగమాంతమూ - పరభోగవంతమూ । ఆగమముల
దాటి ముందుకు - సాగినడువరా ॥సా॥

(7) ధరను శ్రీమల-యాళగురుని కరుణతో । వరదదాసు
నిరతమును-గురుతుగాంచెరా ॥సా॥

కలికల్మషనివారణకీర్తన - ఆది.

(1) ఓమ్ హరేరామా హరేరామా రామరామా
హరేహరే ।ఓం ।
హరేకృష్ణా హరే కృష్ణా కృష్ణకృష్ణా హరే హరే
ఓం ॥హరే॥

(2) కరుణజూచీ యేలుకోరా-పరమపురుషా పాపదూరా
నిరతమూనీ నామస్మరణా-మరువక ధ్యానింతు లేరా॥
॥హరే॥

(3) ఘోరసంసారాబ్ధి దాటూ దారినెరుగా-జాలమయ్యా
నేరముల నెల్లమరచీ .. దారిజూపు దేవదేవా ॥హరే॥

(4) అండపిండాండంబు లెల్లా - నిండిన బ్రహ్మాండరూపా
దండి ప్రేమజూపి నీదూ-అండజేర్చుకోర ధీరా ॥హరే॥

(5) అందమౌ నీ శ్యామసుంద-రాంగదర్శనంబొసంగీ నంద
హృదయానంద బ్రహ్మ-నందవార్ధి దేల్చుమయ్యా॥హ॥

(7) ధరణిదోనేపూడినగరా - ధామ ఆదినారాయణా,
వరదదాసాహృదయావాసా పరమచిద్విలాస
యీశా ॥హరే॥

---

(సాధుజనార్దనమూదిరి) ఆది.

1. కరుణాసాగరరామా, గుణధామా, బలభీమా, సుర
ముని వందితనామా ॥కరు॥
2. ఉడుతను బ్రోచిన నీదయ నాపై-కడువడి జూపుము
కాంచనచేలా- ఇడుములకోర్వగ జాలా, చలమేలా?
యీలీలా తడయకు సీతాలోలా ॥కరు॥
3. దిక్కులేక పడియున్న యహల్యను-చక్కగబ్రోచిన,
చరణములకు నే మ్రొక్కెద నిరతము దేవా, ఘన
భావా, యిటురావా- గ్రక్కున గయగనలేవా ॥కరు॥
4. బందెఖానలో పంద్రెండేడులు-బాధపడిన శ్రీరామ
దాసునీ । బందెనుదొలగించితివీ గాచితివీ-బ్రోచితివీ
బంధరహితు జేసితివీ ॥కరుణా॥
5. హా! కృష్ణా! యని ద్రౌపది వేడిన - అంతలోననే వలు
వల నొసగిన । నీదయ నెటువర్ణింతూ వినుతింతూ -
ప్రణుతింతూ నేగతి నిను పొడగాంతూ ॥కరుణా॥
6. ధర వ్యాసాశ్రమ ధాముడయిన శ్రీ - పరమసద్గురుని
పదములగొలచిన। వరదాదాసుడస్వామీ వినవేమీ?
కనవేమీ? పరమాత్మా యిటురమ్మా ॥కరుణా॥

(ఆత్మపుత్రిక వెంకమాంబ సంతసము)

కీర్తన — చాపు.

1. నాతండ్రి ననుప్రేమ - యోగిగమ్మనెనే
యోగిగమ్మనెనే వి - రాగిగమ్మనెనే నా॥

2. కరుణప్రేమలతోడ - కరగిపొమ్మనెనే
కరగించినామది - గురిజూడుమనెనే నా॥

3. ప్రేమకంటెను ఆత్మ - వేరులేదనెనే
ప్రేమచే పరిపూర్ణ - గామిగమ్మనెనే నా॥

4. అన్నిజీవులలోన - నన్నుగనుమనెనే
అన్నిటిగన్గొని - ఐక్యమగుమనెనే నా॥

5. కామక్రోధంబుల - ఖండించుమనెనే
కామంబువదలి ని - ష్కామిగమ్మనెనే నా॥

6. ఆనందమనె పండు - అందుకొమ్మనెనే
ఆనందవార్ధిలో - అణగిపొమ్మనెనే నా॥

7. సుఖదుఃఖములదాటి - సుఖియింపుమనెనే
స్తుతినిందలకు బోక - సుమతిగమ్మనెనే నా॥

8. భగవంతు నిరతము - భజియింపుమనెనే
బ్రహ్మానందామృత - పదవిగనుమనెనే నా॥

9. వరదప్రేమానంద - గురినిల్పుమనెనే
గురునిల్పి నిల్పి ని - ర్గుణివిగమ్మనెనే నా॥

10. ధరశ్రీవ్యాసాశ్రమ - ధామసద్గురునీ
మరువక మదిలోన - స్మరియింపుమనెనే నా॥

శ్రీసనాతన ధర్మసేవా సమాజవిజయము. ఆది.

1. శ్రీసనాతన ధర్మభాసుర సభకు జయ్ జయ్-వ్యాసా
శ్రమంబునకు జయ్। సద్గురుస్వామి దాసానుదాసులకు
జయ్ ॥శ్రీ॥

2. శాంతిమతంబునకు జయ్-సత్యధర్మంబులకు జయ్
సాధు సమాజమునకు జయ్ - సద్గురుస్వామీ సద్భక్తు
లందరికి జయ్ ॥శ్రీ॥

3. ఋషిధర్మమతమునకు జయ్ ప్రేమస్వరూపులకు జయ్
సభగాంచుపుణ్యులకు జయ్ - సద్గురుస్వామీ సత్యస్వ
రూపులకు జయ్ ॥శ్రీ॥

4. కార్య నిర్వాహకులకు జయ్ - కర్మయోగులకు జయ్
ఘనదీక్షావంతులకు జయ్ - సద్గురుస్వామీ కరుణా
స్వరూపులకు జయ్ ॥శ్రీ॥

5. తెనాలాశ్రమమునకు జయ్-దివ్యగురుబోధలకు జయ్।
ఘనయుపన్యాసకులకు జయ్ - సద్గురుస్వామీ అను
భవ పూర్ణులకు జయ్ ॥శ్రీ॥

ఆదిమాంధ్రి ప్రార్థన. హిం — ఆది.

1. దిక్కు-లేనివారమయ్యా-దేవదేవ బ్రోవుమయ్యా।
అక్కటకట యిట్టిఘోర-మనుభవింపగజాలమయ్యా ॥ది॥

2. అంటరానివారమటా - చెప్పరాని క్రూరులమటా।
వెంటదినే కోడికుక్కల-కంటెమేము హీనులమట ॥ది॥

3. హిందూదేశమున బుట్టి-హిందు దైవములను గొల్చి
హిందులుగ నుండు మమ్ము-నింద జేయతగునటయ్యా ।ది।
4. నీదునందనులముగామో-నీతులను నేర్వలేమో ఏది ।
మాకుమార్గమో మే - మెరుగజాలకుంటిమయ్యా ॥ది॥
5. మనుజలోకమందునేడు - మహాత్ముడవగుచుబుట్టి ।
మమ్ముగావ దీక్షబూని-మనిచినావు కన్నతండ్రి ॥ది॥
6. కొందరింకను కరుణలేక - కొట్టవచ్చుచున్నారయ్యా
అందరి హృదయముల ప్రేమ-పొందజేసి కావుమయ్యా
7. బావులలో నీరొసంగి - బడులలోన చదువనిచ్చి ।
దేవు నీయాలయములకు-బోవజేసి యేలుమయ్యా ॥ది॥
8. పొందుగ శివరామకృష్ణా-నందసేవా సమాజమునందు
వరదదాసుసేవ - లంది విజయ మొసగుమయ్యా ॥

రామయోగి పాట — ఆది.

1. కురుమద్దాల్ మఠములోనా-కొలువున్న రామయోగీ
దరిశనమును జేయండి - ఆప్రేమమూర్తి స్పర్శనమైన
చాలండీ ॥కురు॥
2. హరిజనుల వంశమందు-హరికారుణ్యమునబుట్టి ।
అరిషడ్వర్గముల ద్రుంచెనూ-శ్రీరామయోగి పరమా
నందమున మించెనూ ॥కురు॥
3. కన్నకూతురితోడా - కలిమాయ తన్నువీడ। ఉన్మని
లోన నిల్చెనూ — శ్రీరామయోగీ వెన్నెల వలెను
బొల్చెనూ ॥కురు॥

4. నిర్గుణ బ్రహ్మానంద - నిత్య సమాధిలోనా
నిరతము మున్గుచుండునూ - శ్రీరామయోగీ
దురితాళి నెల్ల చెండునూ ॥కురు॥

5. పరులు బెట్టిన ఘోర - బాధలనెల్ల నోర్చి
పరమందె దృష్టినిల్పెనూ - శ్రీరామయోగీ
పరమాత్మ వ్రతమునల్పెనూ ॥కురు॥

6. అమృతపానమున సోక్కి - ఆనంద మొందుచుండు
ఆదివ్య సుఖముచూడండీ - శ్రీరామయోగీ
ననుదినమును వేడండీ ॥కురు॥

7. మహాత్ముడనిన తల్లి - మహదానందంబునొందు
మాహాత్మ్యమే మొ చూడండీ - శ్రీరామయోగీ
మహాత్మ భక్తురాలండీ ॥కురు॥

8. బందెకుపోవునపుడు-పండోసగిదీంవిచెనూ। పండెను
తపమునాకునూ - శ్రీరామయోగీ పావనకరునే
మందునూ ॥కురు॥

9. వరదా దానునివహృదయ వాసుడౌసద్గురుని - మరువ
దాయమ్మ యెందునూ। శ్రీరామయోగీ పరిపూర్ణ
భావమందునూ ॥కురు॥

---

హిందువులకు విన్నపము. నాద-ఆట.

1. హరిజనుల ప్రేమింపరయ్యా - శ్రీహరియాజ్ఞయిది
ఆంధ్రులారా వినరయ్యా ॥హరి॥

2. మనతోడి సోదరులుగాదా - వారుమన విగ్రహాంబుల
గొల్చుటలేదా । కినియుటమీకు మర్యాదా - మంచి
కీర్తి బోనాడుట పాపముగాదా ॥హరి॥
3. కుక్కలకోళ్ళను మీరు - బల్ మక్కువతోతా॥
సాకుచుండేరూ । అక్కటయిది యేమి తీరు- మనుజు
నొక్క సోదరుజూచీ ధిక్కరించేరూ ॥హరి॥
4. తురకల క్రైస్తవజనులా - నీరు,
తోడుక బోవనిచ్చెదరు బాపూలా
మరియూదె మీకిది చాలా
వారుమర్దన జేసెదరని చాల దిగులా ॥హరి॥
5. కొట్టిన పాదముబట్టు, తిరిగి
కొట్టకయున్నను - మెడబట్టి నెట్టు
గుట్టుగయుంటు బోగొట్టు
కొనెదు కట్టుడితనమున్న - కట్టాయింకెట్టూ ॥హరి॥
6. మనయాజ్ఞ తలదాల్చువారూ - వారూ
మన మహాత్మ గురుని - మదినిల్పినారూ
మనలనె నమ్మికొన్నారు - ఇట్టి
మంచివారలతోడ - మన కేల పోరు ? ॥హరి॥
7. ఆరుమతములు యొక్కటేను - అనిన
వీరబ్రహ్మముమాట - వెలితేలయూను
ధీరమహాత్ముడు జూను - నట్టి
దేవయుద్ధములోన - తెగిపోరవలెనూ ॥హరి॥

8. దేవుని గొల్వనివ్వండి - మంచి
బావూల నీటిని బట్టనివ్వండి
భావమున కోపింపకండి - వారు
దేవుని బిడ్డలంచును - దెలియండీ ॥హరి॥

9. శరణన్న దరిజేర్పగోరూ - నట్టి
భరతమాతకు మీరు - ప్రభవించినారు
స్థిరకీర్తి మంతులైనారు - నేడు
వరదా దాసుసిమాట - లెరిగియున్నారు ॥హరి॥

---

గీ॥ పరసతీవాంఛ మరిసురా ♦ పానదీక్ష
రెండు సరితూగు పాపముల్ ♦ నిండుదీక్ష
వీని నాశనంబుగ జేసి ♦ మానియైన
వాడెపో ధన్య జన్ముడీ ♦ వసుధమనస !

నాదనామక్రియ—ఆది.

1. ఎంతో పాప మెంతో. పాపమూ
పరసతులపొందు - అంతులేని ఆత్మద్రోహమూ

2. ఎంతో పాపమనుచు పెద్ద - లెరుగ జేయుచున్నగాని
మంతనమున తెలివిదప్పి-మైమరచును మనుజుడయ్యో
॥ఎం॥

3. ఎంచరాని పూర్వజన్మ - సంచితముచేత నరుడు
పంచబాణధరుడు జేయు - వంచనలకు జిక్కెనయ్యో
॥ఎం॥

4. ఎండమావులందు జల - ముందునంచు పరుగులెత్తు
మొండిబ్రరేవలెను జీవు - డెండిమండికూలునయ్యో ॥ఎం॥

5. వేమనార్యు వంటివాడె - కాముబారి జిక్కిమున్ను
ధీమసమున యెరుకగల్గి-కామహతము జేసెగాని ॥ఎం॥

6. భార్యతోడి బ్రహ్మచర్య-వ్రతముసల్పె నాథునుండు
ధైర్యముగా నందరికి-దారిజూపె మహాత్ముండు ॥ఎం॥

7. ధరను శ్రీమలయాళ గురు-చరణసేవ జేసెగాన
వరదదాసుడీవిళాచి-వాతబడక బ్రతికెనయ్యో ॥ఎం॥

---

సావేరి—అట.

1. వినరా ఓజీవా! వినరాఓజీవా! విని వంటేచాలదు-అను
భవింపుమురా ॥విన॥

2. ఎనుబదినాల్గుల-క్షల జీవరాసుల మనుజ జన్మమె
శ్రేష్ఠమని తెలియుమురా ॥విన॥

3. యేజీవి గనలేని - యీ ఆత్మానందము
నీజీవనములోన - నిండి యున్నదిరా ॥విన॥

4. దేహమె నే నను మోహములోబడి
ఆహా తక్కినజీవు - లణగుచున్నవిరా ॥విన॥

5. ఆహారనిద్రా భయంబు - మైథునకాంక్ష
అన్నిజీవులకూను - యున్నదే గనరా ॥విన॥

6. దేవుడనీలోన - జీవుడైనాడుర

భావించి కనలేక - పాడై పోవకురా ॥విన॥

7. ఐహికసుఖములను - నాసక్తిగొని నీవు
మోహసాగరమున - మునుగనేటికిరా ॥విన॥

8. మూలాధారమునందు - కీలించి మనసును
ఫాలభాగముపైని - వాలలాడుమురా ॥విన॥

9. భక్తిజ్ఞానాది చి - చ్ఛక్తి మార్గంబుల
ముక్తికాంతనుగూడి - ముక్తిజెందుమురా విన॥

10. ధర శ్రీవ్యాసాశ్రమ - గురువరుకరుణచే
వరదానందముతోడ - బరగుచుండుమురా విన॥

---

గీ॥ తరుణి లేనిచోట ♦ చెరసాలయనుచోట
బంధనమునజిక్కు ♦ పడినచోట
బంధరహితమైన ♦ పరమసుఖంబిచ్చు
చెలువ దర్శనంబు ♦ గలిగెమనస?

. హిం - ఆది.

1. బళ్లారి జైలులోనా - పరమాత్మ కరుణచే నొక,
యిల్లాలు గోచరించెనుగా । నామదినిగల్గు - కొల్ల
కామ్యములు దీరెనుగా బ॥

2. విడచిన విడువబోమా - కుశి రొమ్మలను రామా ।
నడుదారి నాట్యమాడెనుగా - నాట్యంబులోనే విడ
రాని సౌఖ్యమున్నదిగా బ॥

3. నీవూనీవాడుగాక - నీవేనావాడవైతే, నే నే నీదాన నంటదిగా । నీవున్నదాక, నిన్ను నే-గానననంటదిగా బ॥
4. తల్లి, దండ్రియు, గురుడు ♦ దైవము నేనటంచు మెల్లగ బల్కు-చునుండునుగా । ఆమగువ యెపుడు - కల్లలు బల్క-నంటదిగా బ॥
5. విషయంబుగాని యాని ♦ ర్విషయానందంబు పుణ్య వశమున బొందుమంటదిగా । యేసుఖముదీని - కాస కైన బోలదంటదిగా బ॥
6. మాటల జేలుపోనూ - నీటుకువంగిరానూ । మేటి వైరాగినంటదిగా — త్యాగప్రేమము లెధాటిగజూపు మంటదిగా బ॥
7. హింసనణచి హంసనాపీ-సంసారలతలద్రెంచి। సంసార మెరుగుమంటదిగా । ననునీలోగాంచి - సంశయముడు గు మంటదిగా బ॥
8. , ధరలోమహాత్మ సద్గురు - చరణాసేవలను జేసీ వరదదాసుడు గన్గొన్నా - ఆతగుణమిన్న కిలలోన సాటిలేరన్నా బ॥

దేవగాంధారి - ఆది.

1. ఆనందమానందమాయెను — ఆత్మానంద మనుభవ మాయెనో । ఆనందమెరిగిన సానందగురువుల - మా నని కారుణ్య-మహిమలభింపనేటి కా॥ం॥

2. స్వరాజ్యసాధన జేయగా-ఆత్మస్వారాజ్యమే లభియిం
చెగా నిరాకరణమును సరిగనెరిగి తే-స్వరాజ్యమంత
టను స్వారాజ్యమున్న దిగ ఆన॥
3. దేశక్షేమముగోరి ధీరుడై - పరమేశునియాజ్ఞ బడసి
శూరుడై, ఆశాపాశములతోడ-గాసిల్లకున్న ప్రకృతి
పాశనాశంబుతో - స్వదేశమబ్బునుగద ఆన॥
4. తడబడి త్యాగముజేయగా అందు - పడియున్న యుర
గము లేచుగా । ఇడపింగళులమధ్య గుడిముందునా
డుచు - పడతుక నిరతము విడువకుండునుగద ఆన॥
5. సాంఖ్యమేమో తెలిసిపోయెగా - ఒక్క సంఖ్యకన్న
మిగిలిలేదుగా । సాంఖ్యతారకముల సారము నెరిగిన-
అమనస్క-మంతటను రమణీయమౌనుగద ఆన॥
6. మహాత్మసద్గురు స్వాములాసేవా - మహాఫలంబిది నా
కిలా । అహాలభించిన ఆత్మారాముని - మహాసౌఖ్య
ముల మధుగామృతమిది ఆన॥
7. కోటిజన్మములకు నేటికీ ఇట్టి - మేటిదయాళులిచ్చు
సూటికీ । ధాటిగనడచి కర్మ మీటిసద్గురువులుండు
చోటికినేగి మాటిమాటికి ధన్యుడైతి ఆన॥
8. ధర శ్రీ వ్యాసాశ్రమ ధామునీ నే -
మరువక వేడుచుంటి రామునీ
కరుణా సాగరులైన పరమర్షి గణముల్లెల్ల
వరదా దాసునియందు కరుణా జూపిరిగాన ఆన॥

---

గీ॥ ఉన్నదొకటె జగము ♦ లన్నిట పూర్ణమై
వెలితిలేనిభంగి ♦ వెలయుచుండ
ఒకటి సత్యమనుచు ♦ యొకటి మిథ్యయటంచు
బలికి భేదవృత్తి ♦ బడకుజీవ !

మహావాక్య నిరూపణము.

నాదనామక్రియ-ఆది.

1. అంతా బ్రహ్మమురా - ఈజగమంతా బ్రహ్మమురా
అంతాబ్రహ్మం బనుభవమైతే - అతడెవ్వడు మరి నీ
వెవ్వడురా అంతా॥
2. తెలివినిగాంచుమురా — కాంచే తెలివేబ్రహ్మమురా
తెలియనిదేదో- తెలియునదేదో
తెలిసి తెలిసినది కలసినపిమ్మట అంతా॥
3. నేనెందున్నానురాఉండే నేనేబ్రహ్మమురా — నేనునీవ
నెడు భేదరహితమై-నీవేనేనై నిలిచినపిమ్మట అంతా॥
4. ఆత్మనుగాంచుమురా నీలో-ఆత్మేబ్రహ్మమురా। ఆత్మా
వాత్మ వివేకంబెరుగుచు - ఆత్మనాత్మపరమాత్మ
నంతట అంతా॥
5. గురుకారుణ్యమురా-అదియే గురియైనిల్చెనురా
వరదాదాసుని మరువకనేలిన - వర మలయాళ
స్వాముల సత్కృప అంతా॥

# మేలుకొలుపులు.

భూపాల ఆటతాళము.

1. మేలుకొనుడీ భక్తులారా! మేలుకొనుడీ జ్ఞానులారా!
మేలుకొనుడీ మానులారా! మేలుకొనరయ్యా,
మేలుకొని సద్గురుని సన్నిధిపాలుగొని జ్ఞానామృతం
బును గ్రోలి నిత్యానంద పదవిని వాలలాడరయా
మేలు॥

2. సాధువులు భక్తులును ధరలో చాలకరుణాదూరులైరి
సాధుభావము సమసిపోయెను సత్యమరుదాయెగా
సాధనములే బీజములు, సంశుద్ధహృదయమె క్షేత్ర
రాజము కరుణయొకటే వర్షమంచును గాంచరో
మదినీ మేలు॥

3. అబలలగు సోదరీమణులకు, ఆత్మబలము నశింపజే
సెడి యొట్టికుటిలముబూని రోహో, యేమిపాపమిదీ
అవనిలో దైవస్వరూపము, లైన కొందరి నీవిధం
బుగ దైవదూరుల జేయజూనుట, ధర్మరహిత
మగుగా మేలు॥

4. సాధనము సంశుద్ధహృదయము సర్వభూత దయావర
త్వముల నెదుమూడు లభింపకను మోక్షంబు సిద్ధమ
గుగా రహినికొందరు సాధువరులు విరక్తులై నిర్విష
యముమెందరో అహిత విషయాపేక్షులై చెడిరయ్యయో
జగతిగా మేలు॥

5. వెలయ కరుణావంతులై సర్వేశ్వరుని యందమల హృదయము, నిలిపిచిత్తలయంబు జేసిన గలుగు సర్వంబుగా దేహభావనతోడ మీరలు దివ్యఋషిసంతానమంచును, ఆత్మభావనతోడ దైవమయంబులను కొనుడీ మేలు॥

6. ఇట్టిసాధన గలుగువారలు యెట్టిస్థితిలో యున్నచుక్కాగ గట్టిపడవ లభింపదరిగని గాంత్రుమోక్షంబుగా ఇదియె వేదమతంబు మోక్షంబిదియె సత్యపథంబటంచును, మదినినమ్ముడు సిద్ధపురుషుల మార్గమిది గనుడీ మేలు॥

7. కాలమున గలియకను కాలాతీతస్థితిలో నిలిచియుండుటె కలనలుడిగిన కాలకాలుని చెలువమిది గనుడీ బాలసూర్యోదయము గంటిరే బరగనాత్మోదయము మీకాలీలగల్గుచునుండుటాత్మలో చాల గనుగొనుడీ మేలు।

8. ధారుణీస్థలి లోక సేవయె దైవసేవగ మారునప్పుడు లలితమగు సంపూర్ణజ్ఞానము గలుగునిక్కముగా కోరివ్యాస్రాశ్రమమునందున గురుకులంబున తపము జేసెదు, ధీరచిత్తులుగురుని సత్కృప తేజరిల్లగనూ మేలు।

9. క్షితినియెందరో గొప్పజ్ఞానులు, పతితులై చెడిరన్న సంగతి మదిసిమరువక జాగ్రతగ మీ, మనములో

నిలిపీ అతిబలంబున జ్ఞానకల్పక, మనెడు వృక్షము
నట్టి గూల్పగ సతముచిరిగెడు మనపు లేచుకు, జాడ
పొడగాంచీ మేలు॥

10. భక్తియనియెడు కామధేనువు పరమసుఖమును పచ్చి
కనుదిని, ముక్తిమార్గమునందు దిరుగుచు మోద
మందగనూ రక్తవర్ణపుగ్రుడ్లుమెరయగ రౌద్రరూపము
దాల్చి విషయాసక్తియను పెనువ్యాఘ్రమున్నది
చాటుగనుపొంచీ మేలు॥

11. పరమపావన ఋషులధర్మము, ధరణిలో బోధించు
టకునా పరమ పురుషుని యాజ్ఞచే మీరరుగు దెంచి
తిరీ గురుని తృప్తియొనర్పగోరిన నిరతమాత్మ
నెరుంగుచును సద్గురుని కార్యము దీర్పులోక లే
తెరగుమనకికనూ మేలు॥

12. ధరనశించిన శ్రీసనాతన ధర్మమును పునరుద్ధరింపగ
గురుడు మిమ్ముల బెంచుచుండెను పరమదయతోడా
తరుణ మెరిగియు ధరణిసర్వము దైవమయముగ
మార్చి గురునికి, పరమ సంతోషంబొనర్చెడు భాగ్య
మెన్నడో॥

13. ధరణిలోపల మంత్రమును మంత్రార్థమంత్ర రహ
స్యములునా వరప్రసాదత్రయము సద్గురు కరుణతో
బడసీ పరమపావనమగు చతుర్విధ, గురునిశుశ్రూ

షల యొనర్చుచు వరిప్రబోధామృతము గ్రోలెడు
తరియిదేగనుడీ మేలు॥

14. ఆత్మనావరణంబు జేయునవాత్మమాలిన్యంబునణచిన
అరయగానది అంగశుశ్రూష నగబరగునుగా
ఆత్మయగు నాద్వైదవభావమునందు చలనము లేక
నిల్పుటె అరయగానది భావశుశ్రూషై
చెలంగునుగా మేలు॥

15. గురునివలె సద్బ్రహ్మపథమున స్థిరముగాచరియించు
చుండుటె అరయగానదిపాద శుశ్రూషైదనర్చునుగా
నిరతమును తనస్వస్వరూపము నిర్మలంబుగ జేయు
చుండుటె అరయగా నదిస్థాన శుశ్రూషై
వెలుంగునుగా మేలు॥

16. ధరణి నాశ్రమము లనునిల్పుచు ధర్మబోధను జేయు
చుండుటె। అరయనదియును స్థానశుశ్రూషై
చెలంగునిక। నిరయరహితము మృత్యుహరణము
నిర్మలము సద్గురుప్రబోధము। మరువక నుభవమం
దుండుటే సద్గురు ప్రసాదమగు మేలు॥

17. ఆత్మసిద్ధియు గలిగె నేనియు అనుకొనినయటు జరుగు
చుండును। అదియె సాదృశ్యంబు మరి వేదాంత
సిద్ధాంతం ఆత్మకన్యము లేదు సర్వంబాత్మమయమని
మదిని నమ్ముడు సత్యమిది సత్యంబు త్రికరణ
సత్యమిదిగనుడీ మేలు॥

18. నిరతమును వ్యాసాశ్రమంబున నిత్యసత్యపథంబు
దెల్పుచు పరమదయతో భక్తవర్యుల కరుణజూచు
చునూ బరగు శ్రీమలయాళసద్గురు వరప్రబోధా
మృతము దీనిని మరువకను మననంబుజేయుచు
శరణుగన్గొనుడీ మేలు॥

సద్గురు మేలు కొలుపు, భూపాల, చాపు

1. బ్రహ్మముహూర్తము వేళాయె గురుదేవ, బ్రహ్మా
నందముతోడ మేలుకో। బ్రహ్మజ్ఞానామృత
పానమునొసగి మా, భక్తులదరిజేర్ప మేలుకో బ్ర॥

2. అజ్ఞానతిమిరము అవనీతలమునెల్ల, ఆవరించెను
స్వామి మేలుకో। సుజ్ఞానమనుజ్యోతి సూర్యోద
యమూరీతి, జూపి కాపాడంగ మేలుకో బ్ర॥

3. సాధనదూరులై సాధువుల్ కొందరు, సత్యము విడి
చిరి మేలుకో। సాధనంబులు దెల్పి సన్మార్గమును
జూపి, సత్యము నిలుపంగ మేలుకో బ్ర॥

4. ఆత్మతేజము లేక అబలాజనంబులు, అణగిపోయిరి
తండ్రి మేలుకో। ఆత్మోద్ధారణ జేసి అబలలరక్షించి,
అవనీతలమునేల మేలుకో బ్ర॥

5. కఠినులై మానవుల్ దీనజీవులబట్టి, ఖండించు
చున్నారు మేలుకో। కఠినహృదయములెల్ల కరిగి
నీరై పోవ, కరుణబోధింతువు మేలుకో బ్ర॥

6. ఆచరణములేని వాచా వేదాంతము, అంతటనిండెను మేలుకో। వాచామగోచరసత్యజ్ఞానానంద, వైభ వంబునుజూప మేలుకో బ్రి॥
7. శ్రీసనాతనధర్మ సేవాసమాజంబు, స్థిరముగా వెల యింప మేలుకో। పరమమహర్షుల దివ్యోపదేశ ముల్, ధరణిపై వెదజల్ల మేలుకో బ్రి॥
8. కర్మభక్తిజ్ఞాన ధ్యానయోగంబుల, మర్మములెరిగింప మేలుకో। మర్మములైన మహావాక్యసిద్ధాంత, మంత్రబోధనజేయ మేలుకో బ్రి॥
9. అన్నిటికినీవే ఆధారమనినమ్మి, అండజేరితిమయ్య మేలుకో। అన్నిటికినిలోనై అన్నిటికివెలియై, అన్నియైయున్నావు మేలుకో బ్రి॥
10. ధరణివ్యాసాశ్రమ ధామనీదగుపాద, వరసేవనొసగంగ మేలుకో। వరదదాసాహృదయ సరసిజభాస్కర కరుణా సాగర వేగ మేలుకో బ్రి॥

శ్రీరాగము — ఆది.

1. ఎందుజూచినను నేకరూపమై - వెలుగుచున్నది బ్రహ్మం పంచుకోక ఆనందమయంబై - సర్వసాక్షియై సర్వము తానై ఎందు॥
2. నీవునేననెడు భేదముదోపక - నిలిచియున్నదీ బ్రహ్మం భావాతీతచిదాకాశంబై - పరిపూర్ణంబై పరతత్త్వంబై ఎందు॥

3. అండపిండబ్రహ్మాండములంతట - నిండియున్నదీ
బ్రహ్మం ఖండమెగాక యఖండరూపమై - కర్తయు
కర్మయు భోక్తయు తానై । ఎందు॥

4. దేహగేహముల మోహము విడిచిన - తెలివై
యున్నది బ్రహ్మం। సోహం కారమునిలుకడజేసిన -
సుజనులపాలిటి కల్పభూజమై ఎందు॥

5. శ్రీసద్గురువర కరుణామృతమున -సిద్ధినిమొసగును
బ్రహ్మం రాగద్వేషము రహితముజేసిన - రాజయో
గులకు చింతామణియై ఎందు॥

6. వాసిమీరు శ్రీ వ్యాసాశ్రమమున - భాసురమందెను
బ్రహ్మం। గాసిమొసంగక - వరదాదాసుని జ్ఞానసాధ
నకు మూలముతానై ఎందు॥

(అఖండము) నాద—ఆది.

1. అంతానేనైయుంటి నంతానేనైయుంటి నెంత గొప్ప
వాడనో (సోహంభావము) నా అంతరంగము నందే
ఐక్యముగంటి నేనెంత చిన్నవాడనో ॥అంతా॥

2. సప్తసముద్ర తుషారంబులందును - సరిగానేనేనుంటి
గా ఆసప్తసముద్రంబులకును తుషారము - సమమని
కనుగొంటిగా అంతా॥

3. మేరునగంబులో అణువులో కూడను - మెరయుచు నేనుంటిగా ! ఆమేరునగమునకు అణువునకునుగూడ మిళితము గనుగొంటిగా ॥అంతా॥

4. జ్ఞానవంతుని యందు - అజ్ఞానియందును కలసియె నేనుంటిగా। అజ్ఞానవంతునికి అజ్ఞానికినిగూడ కలయిక కనుగొంటిగా ॥అంతా॥

5. నరకమునందును స్వర్గమునందును - సరిగా నే నేనుంటిగా ఆనరకలోకమునకు స్వర్గమునకు - గూడ పరము గన్గొంటిగా ॥అంతా॥

6. బాధలయందు నిర్బాధల యందును - ప్రజ్ఞామాత్రము గంటిగా। ఆబాధలకును నిర్బాధలకునుగూడ్య-పాదునై నేనుంటిగా ॥అంతా॥

7. పుట్టుటయందూను - గిట్టూటయందును
గుట్టుదెలిసి కొంటిగా
ఆ పుట్టుగిట్టులులేక - చట్టుగవెలిగేటి
దిట్టనై నేనుంటిగా ॥అంతా॥

8. వరశ్రీ ముక్తానంద శ్రీభాస్కరానంద-స్వాముల దయ గంటిగా - వరదాదానుల గురునికరుణ బ్రహ్మానంద భావనలో నుంటిగా ॥అంతా॥

మంగళహారతి - ఆది.

1. ఆత్మా రాములకిదె - మంగళం
పరమాత్మా స్వామికి - జయమంగళం - ॥ఆత్మా॥
అతికరుణా భరణునకు-పతిత జనాదరణునకు ॥ఆత్మా॥
2. వేదాంత వేద్యునకు - మంగళం ప్రణవ
నాదవినోదునకు మగళం
ఆదియును మధ్యమును - అంతమును గనగరాని
॥ఆత్మా॥
3. సత్యసంకల్పునకు - మంగళం
వరనిత్య విలాసునకు - మంగళం
సత్యపద నిరతునకు - సత్త్వగుణ భరితునకు ॥ఆత్మా॥
4. వరదా దాసార్చితునకు మంగళం - శ్రీ
గురురూప ధారునకు మంగళం - దురిత గుణహార
ణునకు నిరతిశయ చరణునకు ॥ఆత్మా॥

---

హిం—మాండు—ఆది.

1. మగువలారా సద్గురునకు మంగళంబని పాడరమ్మా
జగతి సాధుసంఘమునకు - జయమని
కొని యాడరమ్మా ॥మగు॥
2. కనకపళ్ళెరంబులోనా - కర్పూరజ్యోతివ్వరమ్మా
మనసు యేకాగ్రంబుజేసి-కనులమధ్య గాంచరమ్మా ॥మ॥

3. అండపిండాండంబులందు - అంతట పరిపూర్ణుడమ్మా
మొందుగా బ్రహ్మాండమెల్లా నిండియుండే దేవుడమ్మా
మం॥

4. ధరను వ్యాసాశ్రమమునందూ - గురుస్వరూపమంది
ముందూ- వరదదాసూ - హృదయమందూ
బరగు కరుణా శాలికిందూ మం॥

---

సాధుమాత మంగళహారతి-ఆది.

1. మంగళహారతిదుగో - మముగన్న తల్లినీకూ
మాపాలి కల్పభూజాతా - ఓసాధుమాతా,
మహనీయానంద సంధాత్రీ మం॥

2. కన్నబిడ్డలను బోలె - కాపాడినావు జననీ
కైవల్యానంద దాయినీ - ఓసాధుమాతా
కల్మషతాపహారిణీ మం॥

3. సంసారసాగరమునా - హింసల జెందనీక
హంసభావంబు దెల్పితివీ - ఓసాధుమాతా
అమృతమార్గంబు - జూపితివీ మం॥

4. దరిదాపులేని దుఃఖ - తాపముజెందు చుండూ
తరుణుల రక్షసేయగా ! ఓసాధుమాతా
ధరలో జన్మించినావుగా మం॥

5. ఎంతటిభాగ్యమమ్మా - మంతనమున నీదు
చింతనసేయగల్గెనూ - ఓజననీయూశూ
జన్మపావనమాయెనూ మం॥

6. గురుదివ్యపాద యుగళ - సరసిజభ్రమరశీలా
వరజనాబాయి వందితా - ఓసాగుమూశా
వరదాదాసాంత రార్చితా మం॥

---

సురట—రూపకం.

1. మంగళమో మల్లేశ్వర - మంగళమో నగధీరా
అంగనామణులెల్ల నొసగు - హారతిగైకొనుము తండ్రీ
మం॥

2. పులిచర్మము ధరియించీ - బూదిని మైనిండబూసీ
శిరమున చంద్రుడు మెరయగ - ధరిశన
మొసగుముస్వామీ మం॥

3. నీదుమహిమ నెరుగలేక - నినుజెనకిన మన్మథునీ
ఫాలనేత్రమునను జూచి - భస్మముజేసినదేవా మం॥

4. పెటపెటమని లింగమునా భీకరముగ నవతరించీ।
చటురయమున యమునిదన్ని - బాలుని రక్షించితివీ
మం॥

5. అన్నపూర్ణ దేవితోడ - ఆనందమునందితివీ। క్రన్నన

కోనాపురమున ఘనయాశ్రమ కార్యావన మం॥

6. వరదదాసహృదయ వాసా-శరణుశరణు భవవినాశా
పరమపురుష చిద్విలాసా - పాహిపాహిపరమేశా
మం॥

---

"హారతి గైకొనుమా - శ్రీరామచంద్ర" మాదిరి.

అంబా మంగళమూ - శ్రీ అన్నపూర్ణ దేవీ మంగళము.

1. అంబా మంగళ - హారతి గైకొను
శంభుని ప్రియరాణీ - అలినీలవేణి అం॥

2. ముగ్గురు మూర్తుల - మూలము నెరిగిన
ముదితవు నీవమ్మా - ముదమొసగుమమ్మా అం॥

3. నీదయచేగద - సర్వజగంబులు
నిలిచియున్నవితల్లీ - నిజకల్పవల్లీ అం॥

4. మరిమరి దయతో - అన్నపురాసుల
తరుగక యుంచుమమ్మా - దయగాంచుమమ్మా
అం॥

5. సర్వసంతృప్తిని - భక్తుల కొసగుచు
సాకవె మాజననీ - సరసిజపాణీ అం॥

6. అన్నపూర్ణాశ్రమ - మందున వెలసిన
కన్నతల్లివి నీవే - కమలాయతాక్షిణి అం॥

7. వరదా దాసుని-నుతులను గైకొని
ధరియింపవె కొమ్మా - కరుణింపుమమ్మా అం॥

హిం-కాపీ-ఆది.

1. అమ్మా మాహృదయములోకొమ్మా- ఆనంద మొసగు
మమ్మా కడ తేర్చుముమాయమ్మా - పె॥ చి॥ పి॥సీ॥అ॥
2. ముగ్గురుమూర్తులను గనిన - మూలమైన మాయమ్మ
మూడుగుణంబుల కవ్వలకానంబడు - ముక్తికాంత
రాదా దయ లేదా! ఇదివాదా - ననుగావరాద
అమ్మా॥
3. అండాండము పిండాండము - బ్రహ్మాండంబును నీవే
అఖిలచరాచర జగముల - నాడించెదు జననివీవే
వాదాములుభేద ములుభేదా - ములులేనితల్లి అమ్మా॥
4. ఒనరుగ భ్రూమధ్యంబున - ఓంకారరూపంబున
నాదబిందుకళలతోడ - నాట్యంబును జేయుమమ్మ॥
చేరీ నినుకోరీ- నుతిసేతుమమ్మ ఓంకారి అమ్మా॥
5. పుట్టింపను గిట్టింపను - పోషింపను మూలమీవే।
గట్టిగ అధ నార్థిజనుల - కాపాడెదు వరదాయిని ।
కృష్ణాతీరముననిల్చి - కష్టంబుల బాపుమమ్మ
అమ్మా॥

---

(ఒక భక్తురాలి అభీష్టము)

బ్యాగ్-ఏక.

1. తిరుపతాంబదేవినీకు - దివ్యమంగళం పరమదయా
హృదయనీకు భవ్యమంగళం తిరు॥
2. నిత్యనిరంజన స్వరూపీ - నిఖిలమంగళం
సత్యపదవిహారినీకు - సర్వమంగళం తిరు॥
3. సాంఖ్యశాస్త్ర వేత్తనీకు - సకలమంగళం
సచ్చిదానందాను భవ - చరితమంగళం ॥తిరు॥
4. పతిపదసేవిని నీకు - సతతమంగళం
పతితపావనానువర్తి - పరమమంగళం ॥తిరు॥
5. వరదదాసవినుత సుగుణి - నిరతమంగళం
వరశంతేరాశ్రమని - వాసిమంగళం ॥తిరు॥

---

దత్తాత్రేయ మంగళహారతి.

కమాజు - ఆట.

శ్రీదత్తాత్రేయస్వామి హారతిగొనుమీ శ్రీ॥
1. మోదాముతోడమీ - పాదపద్మములకు
మ్రొక్కితిమిదిగోస్వామీ - కరుణింపుమీ శ్రీ॥
2. అత్రిఅనసూయుల - కానందమునుజేయ
చిత్రముగ నవతరించి - చెలగినతండ్రీ శ్రీ॥

3. ముగ్గురుమూర్తుల - యంశములను దాల్చి
మూడుగుణములను గెల్చి - నిల్చినదేవా శ్రీ॥
4. నినుఁ బూజించినవారూ - నిఖిలమహర్షుల
ఘన కరుణ బొందెదరూ - కడతేరుదురూ శ్రీ॥
5. అవధూత పదవినీ - బ్రహ్మానందమునొందీ
అందరినేలితివీ - దయఁ జూచితివీ శ్రీ
6. కనుపర్తి పట్టుర - మున నీ యాశ్రమమున
ఘనభక్తవర్యులచే - పూజలఁగనినా శ్రీ॥
7. వరదదాసా హృదయ- వాసుతాస్వాముల
వరప్రతిష్ఠల నందినా - గురుడవునీవే శ్రీ॥

---

# మనస్సంబోధ నవరత్నములు.

---

(బాలకవి సాయం నారాయణచరణం)

1. మ॥ ధనమున్నన్ జనసంఘమున్నను మహా ♦ ధర్మా
త్ముఁడై యున్న నిర్ధనుఁడైనన్ ♦ వర వంశజాతు
డయినన్ ధాత్రీధవుండైన నొక్కనినైనన్ ♦ భువి
మృత్యువా! విడదు ని ♦ క్కంబిద్దియంచెంచి
ఓ మనసా! యైహిక వాంఛలన్ జనక ప్రేమన్ ♦
రామునిన్ గొల్వుమా.

2. మ॥ మనినన్నాళ్లు సుఖంబొ దుఃఖమొ జగ ♦ న్మాన్య త్వమో నైచ్యమో, దనపూర్వార్జిత పుణ్యపాప ఫల బ ♦ ద్ధంబైన కర్మంబు యె ♦ వ్వనినైనన్ స్పృశియింపకన్విడదు నీ వానంద తత్త్వార్థివై ♦ మనమా! యైహిక వాంఛలన్ జనక ప్రేమన్ ♦ రామునిన్ గొల్వుమా.

3. మ॥ ఘను, నీలాంబుద దేహు సర్వమయు ని ♦ ష్కాముఁన్ జగద్వంద్యు నిత్యు నిరాలంబకు నిర్వికల్పుని ♦ మహాత్మున్ నిర్వికారున్ జనార్దను భక్తిన్ ♦ భజియించి మృత్యు రహిత ♦ త్వంబంది నా రెందరో, మనమా! యైహిక వాంఛలన్ జనక ప్రేమన్ ♦ రామునిన్ గొల్వుమా.

4. మ॥ ఎనయన్ తొమ్మిదిమాసముల్ భయదమై ♦ హేయంబునౌ గర్భబాధను నార్తిన్ బడి దుష్ట గంధయుతమౌ ♦ త్రిద్వార మార్గంబునన్ జననం బందిన యీ శరీరమున గాం ♦ చన్ సౌఖ్యమా? లేదు ఓ మనమా! యైహిక వాంఛలన్ జనక ప్రేమన్ ♦ రామునిన్ గొల్వుమా!

5. మ॥ జననీ గర్భమునందు బాల్యమున న ♦ జ్ఞత్వంబునన్ దీక్షను ప్తిని నెల్లప్పుడు ధేనువత్సము లరీ ♦ తిన్ కాయకన్ బ్రోచు స్వామిని నాదేవుని నమ్మ నే

దోసగులుఁ ♦ వీక్షింపవో భ్రాంతమా మనమా!
నైహిక వాంఛలఁ జనక ప్రేమఁ ♦ రామునిఁ
గొల్వుమా॥

6. మ॥ వనియందైన నదృష్టమున్న సిరి ప్రా ♦ ప్తంబౌను
లేకున్న నే ఘనయత్నంబు ల ♦ నెన్ని చేసినను నీ
కాలక్ష్మి రాదట్టిచో, ధనసంపాదన కీవు త త్తరము
కెం ♦ దగాలోక స్థైర్యంబునఁ మనమా! యైహిక
వాంఛలఁ జనక ప్రేమఁ ♦ రామునిఁ గొల్వుమా॥

7. మ॥ పనియేమున్నది నీకు! నీనడకలఁ ♦ బాటించి
మోదాన ని ♦ న్ననురూపంబుగ జూచు మాన
వునినా ♦ హా ఘోర దౌర్భాగ్య పాపనికాయాం
బుధిఁద్రోసి రచ్చలకు నీ ♦ ద్వంజేసి యేడ్పిం
తువో మనమా ! యైహిక వాంఛలఁ జనక
ప్రేమఁ ♦ రామునిఁ గొల్వుమా॥

8. మ॥ ఘనధీ చాతురి రామనామ జపమె ♦ కాలంబు
నన్వీడకఁ ఘనమా భక్తిని ప్రాణమానముల
జో ♦ కఁ రామునిన్నేర్చి శాంతిని నీ ♦ వెప్పుడు
బొందగల్గుదువో య ♦ ద్దే నీకు సౌఖ్యంబు నౌ,
మనమా! యైహిక వాంఛలఁ జనక ప్రేమఁ ♦
రామునిఁ గొల్వుమా॥

9. మ॥ అనఘా యాశ్రిత వత్సలాయ హరయే ♦ ఆనంద
సంధాయినే। జిన రూపాయ వర ♦ ప్రదాయ
భవతే సీతాధి నాథాయ। స ♦ జ్జన రక్షాయ
నమోనమోస్తు యని స్వే ♦ చ్ఛావృత్తి గీర్తింపు
మా ! మనమా ! ఐహిక వాంఛలన్ జనక
ప్రేమన్ ♦ రాముని గొల్వుమా ॥

---

హిం — ఆది.

1. మంగళాహారతిదే - మా రామచంద్రునకు
మా రామచంద్రునకు - మలయాళస్వాములకు ॥మం॥
2. తారక సాంఖ్యాదియోగ - సారమువిచారునకు
దారి తెలిపి భక్తవరుల - దరికి జేర్చు దేవునకు ॥మంగ॥
3. శుష్కవాదదూరునకు - సూరిజన వినుతునకు
నిష్కపట హృదయునకు - నిర్మలాచారునకు ॥మంగ॥
4. ఆనందరూపునకు - అఖిల వేదవేద్యునకు
మానసాంబుజంబునందు-గానిపించు భానునకు ॥మం॥
5. వైరరహితభావునకు - వరదదాప వంద్యునకు
ధీరకొండ మాచపుర - పౌరాత్మ నిలయునకు ॥మం॥

మహాత్మా మంగళహారతి, ఆది.

మంగళ హారతినిగొనుమా - మహాత్మా భూరి
దయ గనుమా ॥మం॥

1. పరోపకారగుణభూషా-కస్తూరిబాయి హృదయేశా
భరత మాతృవరపుత్రా- మహాత్మాభవ్యచారిత్రా ॥మ॥
2. నీపాదయుగళమును గొల్చి-దివ్యాత్మ యుద్ధముననిల్చి
జయింపాగలుగుధైర్యంబూ-నొసంగీకరుణబాలింపు॥
3. కర్ద్వార మగరుజవ్వాజీ గొనుచూ-మగువలందరూ
నీధ్యాన మగణితంబుగ జేసిరి-సుగుణసువిచారా ॥మ॥
4. అధర్మ గుణములను ద్రుంపా - స్వధర్మగుణములను
పెంపా జన్మించి భువినిమించితివి — సత్కీర్తి పొంద
గాంచితివి ॥మంగ॥
5. పురాణ పురుషగుణజాలా-భక్తుల పూజగొను చాలా
వరద దానపరిపాలా-సత్ప్రేమ వదల కవ్వేళా ॥మం॥

మంగళము.



# మంగళము.

ఆది. (ఇది యితర కవికృతము)

1. గురునకు మంగళమనరమ్మా సన్గురు మూర్తిని గను
గొనరమ్మా, తరుణులార యిత్తరి మనభక్తితో మఱి
యుచు మ్రొక్కిన మోక్షము చేకురు ॥గు॥

2. క్షరరూపుండును గాదమ్మా అక్షరపురుషుండనదగ
దమ్మా, క్షరపురు షాక్షర పురుషులకెల్లను పరమై
నిండిన పరిపూర్ణుండగు ॥గు॥

3. జ్ఞానియన్నను గాదమ్మా, అజ్ఞానియనుట యెట్లో య
మ్మా, జ్ఞానాజ్ఞాన విజ్ఞానములెల్లను కానివస్తువే
పూనిదెల్పు శ్రీ ॥గురు॥

4. సత్యరూపుడునుగాడమ్మా, అసత్యవంతుడనదగ
దమ్మా సత్యా సత్యంబుల త్యజించి ఓ మిత్యేకాక్ష
ర బ్రహ్మమైనిలచిన ॥గు॥

5. పిండరూపుడునుగాడమ్మా, బ్రహ్మాండరూపి మనకే
దమ్మా, పిండబ్రహ్మాండంబు రెండును, రెండహంబుల
ను ఖండనజేసిన ॥గు॥

6. ద్వయరూపుండునుగాడమ్మా, అద్వయరూపం బన
లేదమ్మా ద్వయాద్వయముల దగులక వెలిలో బయలు
లోన నిర్భయు లైయుండిన ॥గురు॥

7. రూపవంతుడునుగాడమ్మా, అరూపియనుట యెట్లో
యమ్మా, రూపా రూపంబులుగానిది ప్రకాశ రా
మయ్యకు ప్రాపుగ దెలిపిన ॥గురు॥

---

ముఖారి - ఆది.

1. మంగళ హారతిని గొనుమా ।
మాధవా వేవేగరమ్మా ॥మం॥
రంగనాథా! సంగరహితా!
రామచంద్రా! సుగుణసాంద్రా! ॥మం॥

2. అగరుకర్పూరంబు మంచీ - ఘుగఘుగ వాసనలు వెల
యా । నిగమవినుతా సుగుణ భరితా - నీకిదేనివ్వా
లిదేవా ॥మం॥

3. తప్పులు మన్నించి మాకూ - దారిజూపే దొరవు
నీవే । ఒప్పుకొనుమా తప్పులన్నీ - ఓ మహాత్మా
కరుణజూనీ ॥మం॥

4. ధరణివ్యాసాశ్రమమునందూ - బరగిన సద్గురువ్వరూ
పా ॥ వరదదాసా హృదయవాసా - శరణు శరణూ
మందహాసా ॥మం॥

హిం — ఆది.

మంగళం దివ్యనుతనామ శ్రీ రామా - మంగళం
భవ్యగుణధామ ఓ రామా మం॥

1. సంగరధీరా లింగశరీరా - పాండురంగామనోజాత
శృంగారా। పాపభంగా మంగళమును గైకోరా ॥మ॥

2. వారధిశయనా! నీరజనయనా! రారాకారుణ్య రస
పూరరఘువీరా।నిత్యకల్యాణగుణ-దీనమందారా॥మ॥

చ. ధారుణిమోంటి మిట్టవిహారా - ధీరవారణ సంత్రాణ
గోపాలా। సాయుంవరదా - దాసార్చితగుణజాలా ॥మం॥

క॥ మంగళము సద్గురునకును
మంగళము మహాత్మునకును మా ♦ రమణునకున్
మంగళము సాధుమాతకు
మంగళము సమాజమునకు మా ♦ పితరులకున్.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

స ం పూ ర్ణ ము.

---

# యథార్థ భారతి.

ఈపత్రిక శ్రీ కాళహస్తికి సమీపముననున్న ఏర్పేడు కాళీబుగ్గతీర్థ తీరమందుండు "శ్రీవ్యాసాశ్రమము" తరపున శ్రీ శ్రీ శ్రీ మలయాళస్వాములవారి అధిపత్యమున భక్తిజ్ఞాన వైరాగ్య విషయములలో ప్రకటింపబడు మాసపత్రిక.

సంవత్సరమునకు చందా రు 2—8—0

రంగూన్ సెటాలు మొదలగు విదేశములకు 3—0—0

పుస్తక భాండాగారములకు భజనమందిరములకు సమాజ వాచక శాలలకు మాత్రము 2—4—0.

---

